# జమీన్‌రైతు

ESTD. 1930
Regd. No. H. NL. 18
సంపుటి: 69 సంచిక: 46
18-11-1988
నెల్లూరు
శుక్రవారం
12 పేజీలు రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు    మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి


# ఆస్తుల వివరం అడిగితే ఆగ్రహావేశాలెందుకు?

నేషనల్ ఫ్రంట్ కన్వీనర్ శ్రీ వి. పి. సింగ్ స్వంత ఆస్తుల స్వచ్ఛంద ప్రకటన మన ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు మెడకు ఉచ్చులాగా తగులుకున్నది. గొంతులో పచ్చివెలక్కాయ పడ్డట్లయింది ఆయన నేషనల్ ఫ్రంట్ ఛైర్మన్‌కూడా కావడంతో కక్కాలేక, మింగాలేక గిలగిలలాడిపోతున్నారు. తనను తాను సత్యవ్రతుడిగా, సచ్ఛీలుడిగా, సర్వజ్ఞ పరిపాలకుడిగా, సత్యహరిశ్చంద్రుడి స్వంత సోదరుడిగా అభివర్ణించుకుంటుండిన ఎన్టీ రామారావు ఇప్పుడు తన మనసులోని మాలిన్యాన్ని మురికిని తానే బయట పెట్టుకున్నాడు.

ఎన్టీ రామారావు 1988 నాటి ఎన్నికల ప్రచారంతోనే తన ప్రభుత్వం అధికారంలోకి వస్తే తాను తన మంత్రులందరి ఆస్తులను ముందుగా ప్రజలకు వెల్లడిచేస్తానని వాగ్దానం చేశాడు. అయితే ఎన్నికల తర్వాత అందరు రాజకీయ వాదులవలె ఆ సంగతి మర్చిపోయాడు. అప్పుడప్పుడో పత్రికలవారు నిలదీయడంతో సీల్డు కవరులో వివరాలు వ్రాసి పెట్టామని చెప్పాడు.

మా రాజకీయ పరిశీలకుడు

ఆ సీలు విప్పిందిలేదు - లోపల విషయం బయట పెట్టిందీలేదు. ప్రజలుకూడా దాని సంగతి మర్చిపోయాడు.

ఇప్పుడు వి పి సింగ్ తాను అలహాబాద్ ఉపఎన్నికల సందర్భంగా ఇచ్చిన మాటను నెరవేర్చడంతో కథ మళ్ళీ మొదటికి వచ్చింది. పత్రికలవారు తన సంగతి అడిగినప్పుడు ముఖ్యమంత్రి ఏదో ఒక వాయిదావేసి సరిపెట్టివుంటే ఏ పేచీలేకుండా పోయేది! కాని ఆయన తన ఆస్తి వివరాలు ప్రధాన కార్యదర్శి వద్ద వున్నాయని చెప్పాడు. ప్రతిపక్షనాయకులు, పత్రికా విలేఖరులు వెంటనే ప్రధాన కార్యదర్శిని తగులుకున్నారు. ఇంత త్వరగా వీరిట్లా ప్రతిస్పందిస్తారని ఎన్టీఆర్ ఊహించలేదు. ప్రధాన కార్యదర్శి దగ్గర ఏదైనా కవరు వుంటేకదా ఆయన దాన్ని విప్పిచెప్పడానికి? నిజంచెప్పి నిష్ఠురపడడమెందుకని ఆయన నెపం ముఖ్యమంత్రి పైనే త్రోశాడు.

గోడకుకొట్టిన బంతివలె తాను అనాలోచితంగా చెప్పినమాట తనపైకే తిరిగివచ్చి ఉచ్చులాగా బిగుసుకోవడంతో ఎన్టీఆర్ ఉక్కిరి బిక్కిరైపోయాడు. కక్కాలేక మింగాలేక తబిబిపడిపోతున్నారు. ఆ అయోమయంలో ఆయన పత్రికలవారిపై ఆగ్రహపడి మరింత సమస్య సృష్టించుకున్నారు.

అధికారంలోకి వచ్చినతర్వాత అవినీతికి పాల్పడి అదనపుఆస్తులు సేకరించకుండా చూడడానికే ముందుగా ఆస్తులు ప్రకటించాలని కోరేది! ఈ సత్సంప్రదాయాన్ని భారతీయ రాజకీయవాదులెవరూ పాటించలేదు. అదృష్టంచూస్తే ఎన్టీఆర్ ఒక్కడే నేరస్తుడుకాదు. కాని మిగతావారివలె మౌనంగావుండక ప్రజల మెప్పుకోసం గొప్పకుపోయి ముందుగా మాట ఇవ్వడంతోనే ఈ పేచీవచ్చింది. ఇది ఆయన త్రవ్వుకున్న గొయ్యిక్రిందే లెక్క.

ఎన్టీ రామారావు నిజంగా నిజాయితీపరుడైతే, పదవిలోకి వచ్చిన తర్వాత అవినీతికిపాల్పడి అక్రమార్జన చేయకుంటే ఆస్తుల వివరాలు చెప్పడానికి అంత ఆగ్రహపడాల్సిన అగత్యమేమున్నదనేదే ఇప్పటి ప్రశ్న! ఆయన ఆస్తులు వెల్లడి చేయడానికి భయపడేకొద్దీ, ఆయనా అవినీతి పరుడేనన్న అనుమానం ప్రజలలో ప్రబలుతున్నది.

నిజానికి ఎన్టీ ఆర్ గద్దెనెక్కినతర్వాత హైదరాబాదులో అధికభాగం ఆస్తులు సమకూర్చుకున్నారు. రాయల్ హోటల్, వసంతవిహార్, సంధ్య థియేటర్, గండిపేట నాచారం ఆశ్రమాలు తదితరాలన్నీ ఇటీవలం సమకూర్చుకున్నవే! మొదటి మూడు భవనాలు ఒక్కొక్కటి ఐదారు కోట్ల విలువ చేస్తాయి. ఇక మద్రాసులో కొత్తగా కట్టిన భవనాలు, కొన్న స్థలాలు అసంఖ్యాకం! చంద్రబాబు వంటి అల్లు

—కొరవ 7వ పేజీలో



# బుద్ధుడి పేరుతో కోట్లు దుబారా!

పిసిసి అధ్యక్షుడు శ్రీ ఎన్. జనార్దన రెడ్డి ఆ మధ్య ముఖ్యమంత్రిని మధ్య యుగాలనాటి చక్రవర్తిగా అభివర్ణించారు. హుస్సేనసాగర్‌లో నెలకొల్పడానికి రాష్ట్ర ప్రభుత్వం చెక్కిస్తున్న బుద్ధ విగ్రహాన్ని చూస్తుంటే ఆమాట అక్షరాలా నిజమనిపిస్తుంది.

అరవై అడుగుల ఎత్తుగల్గిన ఈ బుద్ధ విగ్రహంవల్ల బౌద్ధ యాత్రికులకు భాగ్యనగరం పెద్దయాత్రాకేంద్రంగా మారనున్న మాట వాస్తవమే. అయితే దీని ప్రతిష్ఠాపన వెనుక ముఖ్యమంత్రి నిజోద్దేశ్యం అది కాకపోవడమే దురదృష్టకరం! పాతకాలం రాజులు తమపరిపాలన స్మృతిచిహ్నంగా, విజయ కేతనంగా దేవాలయాలు, స్థూపాలు నిర్మించినట్లు ఈ విగ్రహాన్ని ప్రతిష్ఠింపచేస్తున్నారు. తన ఐదేళ్ళ పరిపాలన చరిత్రలో చిరస్థాయిగా నిలబడిపోవడానికి ఈ విగ్రహం ఉపకరిస్తుందని ఆశపడుతున్నారు.

ఒకవ్యక్తి, వ్యక్తిగత ప్రచారంకోసం,

—కొరవ 7వ పేజీలో

# మండలాలు పెట్టడ మెందుకు- ముండ వేయించడ మెందుకు?

మండల, జిల్లా ప్రజా పరిషత్ ఎన్నికలు జరిగి ఒకటే సంవత్సరం గడచిపోయింది. 1987 మార్చి 11 తేదీ జరిగాయి ఎన్నికలు. అంటే మండలాధ్యక్షుల పదవీకాలం మూడవవంతు హరించుకొనిపోయిందన్నమాట. ఈ ఏడాదిన్నర కాలంలో ఈ ఎన్నికైన ప్రజాప్రతినిధులు ప్రజలకు చేసిన మేలేమిటో పరామర్శించుకుందామంటే ఏమీ కన్పడటంలేదు. ఎందుకు ఎన్నికైనారో, ఎన్నికై ఏమి చేస్తున్నారో అర్థమే కావటంలేదు. పనీపాటా లేకున్నా ఎమ్మెల్యేలకు వ్యక్తిగత ప్రివిలేజీలు, శాసనసభా సమావేశాలు, హైదరాబాదు రాకపోకలం కాలక్షేపం వుంటాయి. మండలాధ్యక్షులకు ఆ పనీ లేదు; వారిని పట్టించుకునేవాడులేడు. వారికేదైనా గుర్తింపుంటూవస్తే పల్లెల్లో రావలి; కానీ మండలాధీశులు పల్లెం పొలిమేర చూడడానికే భయపడిపోతున్నారు.

అంతదూరంపోతే పల్లె ప్రజలు చుట్టుముట్టారు; రోడ్డుకావాలని, నీళ్ళు లేవని అడుగుతారు. వారి కోర్కెలు తీర్చే అవకాశం, అందుకాటు వీలికలేవు. మొదట మొదట అందమైన హామీలు గుప్పించి వస్తుండివాడు నిజానికి అవన్నీ అసత్యాలేనని అర్థమైపోయింది. ఇప్పుడు ఏదు చెప్పినా వారు నమ్మేటట్లులేరు. ఇచ్చిన హామీ ఒక్కటైనా నెరవేరిస్తేకదా, ఎవరికైనా నమ్మకం కల్గేది?

ఎన్టీ రామారావు విశ్వామిత్రుడి త్రిశంకుస్వర్గంలాగా ఏదో ఆవేశంలో మండలాలను సృష్టించాడు, తన సొమ్మేమీ పోయినాలక్షే ఎన్నికలు జరిపించాడు; అవర్వాత వాటిసంగతే మర్చిపోయాడు. ఏ ప్రజాపాన్ని హితవ్యం కోసం మండల రాజ్యాంగ విధానం ప్రవేశపెట్టబడిందో, అది నెరవేరకపోవడమేగాక, పంచాయితీల పరిపాలన ప్రజలకు మరింత దూరమైపోయింది. అధ్యక్షులకు పదవులివ్వడాన్ని తప్ప మరెందుకూ కొరగాని దండగమారిన పథకమైపోయింది.

> పంచాయతి మండలాలకు నిధులు లేవు, విధులు లేవు;
>
> రెవిన్యూ మండలాలలో అవినీతి ఆకాశమంత ఎత్తుకు పెరిగిపోతూంది!

జిల్లాలో 46 మండలాలున్నాయి. పాత సమితుల స్థానంలో ఏర్పడినవాటికి తప్ప ఒక్కినవాటికి ఈనాటికీ స్వంత భవనాలు కూడా లేవు. ఇరుకు అద్దెకొంపలలో తల దాచుకుంటున్నారు. తగిన ఫర్నిచరులేదు; కొందరు అధ్యక్షులు తమ ఇంటినుండి స్వంత కుర్చీతెచ్చి వేసుకుంటున్న సంఘటనలూ వున్నాయి. అధికభాగం మండలాలకు పూర్తిస్థాయి ఎం డి ఓ లు కూడాలేరు. పశువుల డాక్టర్లను, వ్యవసాయ అధికార్లను తాత్కాలికంగా నియమించి నడుపుకొనివస్తున్నారు. వారికి తమ స్వంతశాఖ పనిచేయడానికి తీరికుండదు; మండల నిర్వహణ చేతకాదు. ఉభయభ్రష్టత్వం పట్టిపోతున్నారు.

జిల్లాపరిషత్‌నుంచి మండలాలకు చిల్లిగవ్వ నిధులు రావడంలేదు. స్వంత నిధులంటూ ఏవీకేమీ లేవు. డి ఆర్ డి ఎ, హౌసింగ్ తదితర పథకాలు మండలాఫీసుతో సంబంధం లేకుండానే జరిగిపోతుంటాయి. ఫలితంగా మండలంలోని ఇంజనీరింగు సూపర్‌వైజర్లు, పలువురు విస్తరణాధికార్లు, గుమాస్తాలు చేసేపనిలేక గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటున్నారు. నిధులు లేనప్పుడు విధులేముంటాయి?

ఎన్నో ఆశలతో, ఊహలతో ఎన్నికల్లో గెల్చిన ప్రజాప్రతినిధులు చేయడానికి ఏపనీలేక, అడిగేవారికి సమాధానం చెప్పలేక సతమతమైపోతున్నారు. జిప్రప ఛైర్మెన్ శ్రీ దేగా నారసింహారెడ్డికూడా అబద్ధాలతో వచ్చేవారిని మభ్యపరిచేకంటే, ఆరునెలలపాటు సెలవుపెట్టి వెళ్ళిపోవడం ఉత్తమమన్పిస్తున్నదని అన్నారట. ఎంత విరక్తి కల్గకుంటే, అన్ని లక్షలు పెట్టి గెల్చుకున్న పదవినుండి దూరంగా పారిపోవాలనుకుంటాడు చెప్పండి?

ఇంకొక ప్రక్క రెవిన్యూ మండలాలు అవినీతికి నిలయాలుగా మారిపోతున్నాయి. ఎం ఆర్ ఓ లకు పూర్వపు తాలూకాఫీసు

—కొరవ 10వ పేజీలో

## పినాకినీ తీరం

### అంటరానివాణ్ణిగా ఎవరు చేశారు?

గతానుభవం ఒకటి నాకు గుర్తుకు వస్తున్నది. నావద్ద ఒక సేద్యగాడు; హరిజనుడు; నాలుగక్షరాలు చదువుకున్నవాడు; మంచి తెలివిగలవాడు; ఎవరివద్ద ఎలామాట్లాడాలనో, ఎవరిని ఎలామెప్పించి పనిచేసుకోవాలనో, ఎవరికోపాన్ని ఎట్లా చల్లార్చాలో... ఈ మెళకువలన్నీ తెలిసిన మేధావి; నేర్పరి అతన్ని. అతని మాటలను చూస్తే హరిజనుడనుకోరు; సవర్ణ కుటుంబీకుడనుకొంటారు; అటువంటిసభ్యత సంస్కారాలుకూడా వున్నాయి అతనికి. అతను హరిజనుడు; కాని క్రిస్టియన్‌ను పెండ్లి చేసుకున్నాడు. క్రిస్మస్ పండుగ జరుపుకుంటాడు; హిందువుల పండగలనూ అనుసరిస్తాడు. క్రిస్టియన్ ప్రచారకులను పిలిపించి గౌరవిస్తాడు; తనకూతుళ్ళందరినీ తన బంధువులైన హరిజన యువకులకే ఇచ్చి పెండ్లిచేస్తాడు.

అటువంటి లౌకికుడైన వ్యక్తిని మా లోగిలిలో ఇల్లువేసిస్తాను వుండమంటే; సరే నన్నాడు; కొన్ని రోజులు వుండినాడు కూడా. కాని తర్వాత వున్నట్లుండి కాపురం హరిజనవాడకు మార్చాడు. ఏమిరాఅంటే, మాకు ఇక్కడ నీళ్ళలోని చేపను బయట వేసినట్లుంది; హరిజనవాడలో అయితే అలాతాలంగా హాయిగావుంటుందని అక్కడకు పోయాము అన్నాడు. మనము, మన వాతావరణము అతనికి సరిపడలేదు; మనకంటే హరిజనులమధ్య వుండడం, హరిజనుల పొత్తే అతను కోరుకున్నాడు. తమకైతాము దూరంగాపోయే ఇటువంటి వారిని ఎవరు సంస్కరించగలుగుతాడు? అటువంటివాళ్ళు తమను అంటరానివాళ్ళగా దూరంగా వుంచుతున్నారని అరోపిస్తే ఎవరని ఏమి జవాబుచెప్పగలుగుతాడు?

"కాంగ్రెస్‌ను బాగుపరదాలనుకునేవాళ్ళే మమ్మల్ని ఎందుకో అంటరానివాళ్ళగా చూస్తున్నారు..." అంటూ శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి 12 తేది దక్కలి సభలో వెలిబుచ్చిన నిర్వేదాన్ని పత్రికలలో చదివిన తర్వాత నాకు పైన వివరించిన మా సేద్యగాని వుదంతం గుర్తుకువచ్చింది. 'ఈనాడు' (14 తేది) పత్రికలో ప్రకటితమైన ఆయన వుపన్యాసంలోని మరికొన్ని మాటలివి: "మేమేం పాపం చేశాం, మేమెలాంటి పదవులను ఆశించడంలేదు, ఎలాంటి షరతులు లేకుండా విలీనం కావడానికి సిద్ధంగావున్నాము. రాజీవ్‌గాంధీ ఆదేశిస్తే ఎం. పి. గాగాని, ఎమ్మెల్యేగాగాని పోటీ చేస్తాను. లేకపోతే కాంగ్రెస్ ప్రచారం కోసమే పనిచేస్తాను."

'మమ్మల్ని' అంటున్నాడు శీనయ్య. ఇది తననొక్కడిని వుద్దేశించి ప్రయోగించుకున్న 'రాయల్ వుయ్' పదమా? లేక తమ ఇలాకా వారందరూ అని భావమా? మొదటి సంగతి - తనకైతాను ఒకటికి రెండుసార్లు కాంగ్రెస్‌ను అంటరానిదాన్ని చేసి, పరమ పవిత్రులను కౌగలించుకొని వారితో కాపురం చేశాడుకాని, ఆయన్ను ఏ కాంగ్రెస్‌వాది అంటరానివాణ్ణిగా చూడాడు, చెప్పండి? తాను ఏ జనార్ధనరెడ్డి మూలాన కాంగ్రెస్‌నుండి బయటకు పోయానని చెప్పుకున్నాడో, ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా నియమింపబడిన అదే జనార్ధనరెడ్డిని తాను అభినందించాడు, ఆయనతో సహక

—కొరవ 8వ పేజీలో

## •• సంస్మరణ



జననం : 10-3-1915

మరణం : 1-11-1987

మా అభ్యున్నతికి కృషిచేసిన పూజ్యుడు

మా ఇంటి ఆశాజ్యోతి

**కళాపీఠి రామయ్యగారు**

(ఎలక్ట్రిక్ రామయ్య-రామా ఎలక్ట్రికల్ వర్క్సు)

స్వర్గస్తులై సంవత్సరం గడిచింది,

వారిని సంస్మరిస్తూ వారి

**ప్రథమ వర్ధంతి**

**19-11-88** తేది నెల్లూరు చాకలి వీధిలో

మా స్వగృహమున జరుగును.

కె. జయలక్ష్మి (భార్య)

కె. గౌరీనాథ్ (కుమారుడు). కె. గీత (కోడలు). కె. శ్రీనివాస్ (కుమారుడు)

— కుమార్తెలు - అల్లుళ్ళు —

వి. ఇందిర, వి. కోదండాచారి — కె. సరోజ, కె. వెంకయ్య

ఎస్. రేవతి, ఎస్. ప్రకాశ్ — టి. లీల, టి. త్యాగరాజాచారి

వి. జయ, వి. వీరభద్రయ్య — కె. నిర్మల, (కుమార్తె)

మరియు మనుమలు, మనుమరాండ్రు.

# జమీన్‌రైతు

## తండ్రీ తనయలు

14 తేది పండిట్ జవహర్లాల్‌నెహ్రూ నూరవ జన్మదినం; ఈ సంవత్సరం పొడవునా ఆయన శతాబ్ది వుత్సవాలు దేశమంతటా జరుగుతాయి. 19 తేది శ్రీమతి ఇందిరాగాంధీ జన్మదినం. తండ్రీ తనయలిద్దరూ భారతీయులకు ప్రాతఃస్మరణీయులు.

స్వాతంత్ర్యోద్యమంలో గాంధీశకంవలె, స్వతంత్ర భారత దేశంలో నెహ్రూశకంకూడా మరుపురానిది మరుపలేనిది; చరిత్రలో శాశ్వతంగా నిల్చిపోయేది. స్వాతంత్ర్యసముపార్జనకు గాంధీజీ అనుసరించిన మార్గం ఎట్లా విశిష్టమైనదో, అనితరసాధ్యమైనదో; దేశాన్ని అభివృద్ధిమార్గంలో పురోగమింపజేయుటకు నెహ్రూవేసిన సుస్థిరపునాదులు, నిర్మించినబాటలు ప్రత్యేకమైనవి. ప్రభుత్వాలుమారినా, ప్రధానులు మారినా విధానాలుమాత్రం ప్రథమ ప్రధానిగా నెహ్రూ నిర్దేశించినవిగానే వుంటున్నవంటే, కాలాలకు ఇజాలకు అవి ఎంత అతీతమైనవో, సర్వసమ్మతమైనవో, దూరదృష్టితోకూడినవో విదితమవుతుంది.

రష్యావిప్లవం పండిట్జీని ప్రభావితంజేసింది: సోషలిజం ఆయన మనసుకు నాటుకున్నది. అట్లనే గాంధీజీ ప్రభావం, గాంధిజం పలుకుబడి ఆయనమీద గాఢంగా పడ్డాయి. శాంతియుత పద్ధతులలో, ప్రజాస్వామ్య యుతంగా, ప్రణాళికాబద్ధంగా ఆర్థికస్వాతంత్ర్యానికి, సామాజికన్యాయానికి ఆయన కృషి ప్రారంభించాడంటే సోషలిస్టు సిద్ధాంత సాధనకు గాంధీమార్గం అనుసరణీయమని ఆయన చిత్తశుద్ధితో విశ్వసించాడనుకోవాలి. భారత ప్రథమప్రధానిగా ఆయనపది హేడేళ్ళసుదీర్ఘ కాలం వున్నందువల్ల దేశాభివృద్ధికి సంబంధించిన ప్రతిరంగంలో ప్రతి పనిలో నెహ్రూముద్ర, నెహ్రూరూపం కనపడుతుంది. 'సైన్సు-టెక్నాలజీ'లతో అభివృద్ధిచెందిన దేశాల సరసన భారతదేశం నిలబడాలని ఆయన కలవరించాడు, తపనపడ్డాడు, అహరహం పాటుపడ్డాడు; ఆయన కలలకు రూపం, శ్రమకు ఫలితం మనం ఇప్పుడు అనుభవించ గలుగుతున్నాము.

ఆహారధాన్యాల విషయంలో మనం తిని ఒకరికి పెట్టగలిగిన స్థితికి వచ్చాము. విద్యుచ్ఛక్తి సౌకర్యం మారుమూల పల్లెలకుకూడా విస్తరించింది. పారిశ్రామిక పురోగతి గణనీయంగా పెరిగింది; ఇతర దేశాలకుకూడా యంత్రాలను, సాంకేతిక పరిజ్ఞానాన్ని అందివ్వగలిగిన స్థితికి చేరుకున్నాము. విద్య వైద్య ఆరోగ్య సంక్షేమరంగాలలో అనూహితమైనంత అభివృద్ధి సాధించుకోగలిగాము. రక్షణవిషయంలో మన సమగ్రతను సార్వభౌమాధికారాన్ని పరిరక్షించుకోవడమేకాకుండా, బలహీనమైన ఇరుగుపొరుగు చిన్నదేశాలకు అండగా నిలవగలిగిన బలాన్ని సముపార్జించుకోగలిగాము: అలీనోద్యమం ఈనాడు పెద్దవటవృక్షమై శాఖోపశాఖలుగా విస్తరించి భారతదేశం కీర్తి, స్థాయి ఇనుమడించుటకు అనాడు నెహ్రూ నాటిన చిన్నమొలకే కారణం. ఈవిధంగా దేశం సర్వతోముఖాభివృద్ధి నెహ్రూ వేసిన దృఢమైన పునాదులమీదనే జరుగుతున్నది. దేశం ఈనాడు ఇంత వున్నత స్థితికి వచ్చిందంటే, పేదసాదకూడా పస్తులులేకుండా కలోగంజో త్రాగగలుగుతున్నారంటే,వంటినిండా గుడ్డ కట్టుకోగలుగుతున్నారంటే ఆ మహనీయుని పుణ్యమే. శతాబ్దివుత్సవాల సందర్భంలో ఆ పుణ్యమూర్తికి డెబ్భయ్ఎనిమిదికోట్ల భారతీయులు చేతులెత్తి నమస్కరించాలి!

19 తేది ఇందిరాగాంధీ జన్మదినం. పదకొండేళ్ళపాటు ప్రధానిగావుండి పరిపాలకురాలుగా, రాజకీయవాదిగా తండ్రికి మించిన తనయ అనిపించుకున్న సమర్థురాలామె. నెహ్రూ అంటే కేవలం గౌరవం మాత్రమే; ఇందిరాగాంధీ అంటే భయము భక్తి రెండూను. ఆమె పేదలకు ఆప్తురాలు; పగరులకు సింహస్వప్నం. ప్రభుత్వాన్ని, ప్రణాళికలను సామాన్యప్రజలవద్దకు తీసుకపోయిన ఘనత ఆమెది. పేదవాడిలో ఆత్మవిశ్వాసాన్ని కల్గించి, నోరునిచ్చినకీర్తి ఆమెది. మత సామరస్యంకోసం గాంధీజీ ఆత్మత్యాగంచేస్తే, దేశసమగ్రతకోసం ఇందిరాజీ ప్రాణాన్ని బలిదానంగావించింది. అపూర్వమైన ఆమె సేవాత్యాగాలు, దేదీప్యమైన ఆమె దివ్యరూపం ప్రజల మానసాలలో శాశ్వతంగా నిల్చిపోతాయి!

ఆమె భద్రతాసిబ్బందే, ఆమె భవన ప్రాంగణంలోనే పట్టపగలు ఆమెను పొట్టనపెట్టుకుంటే, నాలుగేళ్ల గడచినా హంతకులు ఈనాటికీ శిక్షింపబడని వాస్తవాన్ని ఈ సందర్భంలో విస్మరించలేకున్నాము. ఆ వీరనారికివే మా జోహార్లు!

---

## జమీన్‌రైతు

18-11-1938

30 పేజీలు అణా

### కెమాల్ పాషా అస్తమయం

దివ్యజ్యోతి, వీరాధివీరుడు, రాజకీయవేత్త, ఆధునిక టర్కీ నిర్మాత యగు కెమాల్‌పాషా ఈనెల 10 వ తేదీన అస్తమించి ఒక్క టర్కీదేశమునేగాక ప్రపంచమంతటిని విషాద సాగరమున ముంచివైచెను.

### కెమాల్ పాషా మనదేశానికి కావాలి!

—"పఠాభి"

పునర్జన్మను మా దేశాన
గయికోవయ్య యశోశేషా
పునర్జన్మను తురుష్కానికి
మదించినట్టి కమాల్పాషా
అమోఘంబగు నీ మేధస్సు
అఖండమయ్యిన నీశక్తి
ఒకింతున్నా యిప్పుడు మీకు
మా దేశమందునేము శ్రీ॥

* * *

యూరోపంతయును తల్లడిల్లగ
బ్రిటిషు సేనల గల్లిపోలీ
యుద్ధమ్మందున దిల్లావల్లగ
తరిమిన ఓయి పరాక్రమశాలీ
"యూరోపురోగిగ" నుండిన టర్కీ
మందు, గ్రీకులు కొట్టిన గర్కీ-
అహా! ఏమి నీ రణకౌశల్యము
టర్కీకిప్పుడు స్వేర్యాకల్పము॥

* * *

ఖలీఫాను తొలగించి కమాల్పాషా!నీవూ
ప్రజాస్వామిక ప్రభుత్వమును ప్రతి
ష్ఠించితివి
ప్రతిష్ఠింపి యధ్యక్షతను అధిష్ఠించితివి
ఓ స్వాతంత్ర్యోజ్వల జాజ్వల్య
మహామూర్తీ॥

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

* * *

మనుజులకోసం మతాలుకానీ
మతాలకోసం మనుజులుకాదని
దాటి మతద్వేషమ్మును మాపిన
నీవుంటేనా భారత మేదిని!
ఓ ముస్తాఫా టర్కీ సింహమ!
నీవేగాన మాకున్నా
ఈలావుండీ యుండేవారా
మా సావర్కార్ మాజిన్నా॥

* * *

టర్కీ యోషామణులకు ఘోషా
నిషేధముచేసిన కమాల్పాషా
అత్యద్భుతం నీ యింద్రజాలం
నీ యౌవనము మనుగలకాలం॥

* * *

మహా మానవా! ఓ
మహావీర! టర్కీ
నియంతా! నమో వా
కమయ్యా కమర్కీ
పునర్జన్మను మా దేశాన
గయికోవయ్య కమాల్పాషా॥

### అన్నా సామయ్యరు నిర్యాణం

నెల్లూరు న్యాయవాద ప్రముఖులును, జమీన్‌రైతు సంఘానికి కొంతకాలం సేవజేసిన వారునునైన వి. అన్నాసామయ్యరుగారు దివంగతులైనందుకు మా విచారాన్ని వారి కుటుంబానికి తెలుపుతూ వారిఆత్మకు శాంతిని ప్రసాదింప భగవంతుని ప్రార్థిస్తున్నాము.

### నెల్లూరుముచ్చట్లు

ప్రెసిడెంటు ఎలెక్షన్

జిల్లాబోర్డు మెంబర్లు 51 మందిలో కాంగ్రెస్ ప్లెడ్జిలో వ్రాలు చేసినవారు 34 మంది- దువ్వూరు నారాయణరెడ్డి, తిరుమల కొండారెడ్డి గారలతోసహా.

* * *

కాంగ్రెస్ పక్షంలో కోదండరాం రెడ్డి, కళ్యాణరావు, దేవరపల్లివారు,

—తరువ 12వ పేజీలో

---

# అడిగే హక్కు ప్రతి ఓటరుకూ వుంది!

ఇటీవల ముఖ్యమంత్రి శ్రీ యన్. టి. రామారావు తన ఆస్తుల వివరాలను వెల్లడించే విషయంగురించి ప్రస్తావిస్తూ, కార్యదర్శివద్ద సీల్డు కవర్‌లో రహిగా వుంచానని, వివరాలు కావలసినవారు తెలుసుకోవచ్చునని ప్రకటించారు. ఈవిషయమై శ్రీ బాగారెడ్డి తదితర కాంగ్రెస్ నాయకులు రామారావుగా కార్యదర్శినడిగితే,ముఖ్యమంత్రిని సంప్రదించి ఆస్తి వివరాలను వెల్లడిచేస్తానని చెప్పడం జరిగింది. ఇలావుండగా మళ్ళీ రామారావుగారు- 'నా ఆస్తి వివరాలు అడిగే హక్కు, అర్హత ఎవరికున్నాయి? అవసరమనుకున్నప్పుడు నేనే ప్రజలముందుంచుతాను' అంటూ కొత్త భాష్యం మొదలుపెట్టారు. రోజుకొక విధంగా మాట్లాడడం ముఖ్యమంత్రికి పరిపాటైపోయింది.

'ఆస్తులను ప్రకటించే విషయమై అడిగే హక్కు ఎవరికుంది?' అని రామారావుగారనడం ప్రజాస్వామ్యాన్ని అవమానపరచినట్లే అవుతుంది. చిత్ర సీమలో వున్నంతకాలం ఆయన ఆస్తులను ప్రకటించమని ప్రజలెవ్వరూ కోరలేదు. ఇప్పుడాయన బాధ్యతకల్గిన రాజకీయ నాయకుడు కాబట్టి అడుగుతున్నారు. ముఖ్యమంత్రిని అడిగేహక్కు శాసనసభ్యులకే కాదు, ప్రతి ఓటరుకూవుంది. అడిగినపుడు తెలియజేయాల్సిన బాధ్యత ముఖ్యమంత్రికివుంది. ఈమధ్య శ్రీ వి. పి. సింగ్ కూడా తన ఆస్తుల వివరాలను బహిరంగ పరచాడు. ఒక ముఖ్యమంత్రిగానే కాదు, నేషనల్ ఫ్రంట్ ఛైర్మన్‌గా ఆదర్శం కోసమైనా శ్రీ రామారావు సీల్డుకవరు విప్పి తన ఆస్తుల వివరాలను బహిరంగపరచాలి.

నెల్లూరు -బి. వి. రఘురామమూర్తి

## జనవాణి

### కాంగ్రెస్ ఐక్యతజరగాలి!

శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డిని పిసిసి అధ్యక్షునిగా ఎంపికచేయడం హర్షదాయకం. రాష్ట్రంలో ఇప్పుడు కాంగ్రెస్‌కు మంచిరోజులు వచ్చాయనిపిస్తూంది. జనార్ధనరెడ్డిగారిని పిసిసి అధ్యక్షునిగా నియమించిన ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధికి అభినందనలను తెలియజేస్తూ-శ్రీరెడ్డి, కాంగ్రెస్ నాయకులందరినీ ఏకంచేసి కాంగ్రెస్‌పార్టీకి కీర్తిప్రతిష్ఠలను తేగలరని ఆకాంక్షిస్తున్నాను.

—అత్తిసరపు దశరధరామిరెడ్డి
బ్రహ్మదేవం

### తెలుగుదేశం దుష్టపాలన అంతమొందించాలి!

శ్రీ జనార్ధనరెడ్డి పి సి సి అధ్యక్షునిగా పొందిన పదవిని అన్నివర్గాలకు అతీతంగా సమర్ధవంతంగా నిర్వహిస్తూ, తెలుగుదేశం పాలనలో జరిగిన, జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను ప్రజలకు చాటి చెప్పాల్సిన బాధ్యత వారిపైవుంది. రాష్ట్రంలోని కాంగ్రెస్ వర్గాన్నంతా సంఘటితపరచి తెలుగుదేశం దుష్టపాలనను అంతమొందించాలి. రాబోవు ఎన్నికల్లో కాంగ్రెస్‌ను విజయలక్ష్మి వరించేలా జనార్ధనరెడ్డిగారు కృషిచేయగలరని ఆశిస్తున్నాను.

నెల్లూరు— ఎన్. ప్రసాద్‌నాయుడు

### వెంకటాచలం ఏమిపాపం చేసింది?

వెంకటాచలం స్టేషను ఆర్ టి సి వారి దృష్టిలో ఒక ఊరుగా వున్నట్లులేదు. అక్కడున్నవారు మనుష్యులుగా కన్పడుతున్నట్లులేదు. బస్సులు ఖాళీగానే పోతుంటాయి. వెంకటాచలం వచ్చేసరికి సూపర్ ఎక్స్‌ప్రెస్‌గామారి రయ్యిమని

—తరువ 12వ పేజీలో

---

## నెల్లూరు ముచ్చట్లు
విమర్శకుడు

### కరువు మంత్రి
కరువనేది కరువై పోయిన నెల్లూరుజిల్లా కరువు మంత్రి శ్రీ వి. రామచంద్రయ్య 15 తేది నెల్లూరువచ్చిపోయారు. అభివృద్ధి కార్యక్రమాలు సరిగా అసలు జరగడం లేదని అసంతృప్తి వ్యక్తంచేసి పోయారట. అయన-నిధులు లేకుండా అభివృద్ధి ఏమి టన్న విషయం ఆయనకు తెలియదా?

### రాజకీయ ఖండనలు
పిసిసి ప్రెసిడెంటు శ్రీ జనార్దనరెడ్డికి శ్రీ నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి కుమారుడు శ్రీ హరనాథరెడ్డి టెలిఫోనులో అభినంద నలు తెలిపాడన్న గతవారం మా వార్త నిరాధారమైనదని హరనాథరెడ్డి ఖండిస్తు న్నారు. మాకు ఆ వార్త చెప్పినవారు విద్యార్థులుకారు; కాని పొరపాటైన ఆ వార్తను ఆయన నమ్మివుంటారు; మాకు చెప్పివుంటారు. ఆ పొరపాటుకు మా విచారాన్ని వ్యక్తంచేస్తున్నాము. అయినా, కర్తవ్యమైనా సందర్భం వచ్చి నపుడు అభినందించడం సంస్కారమవు తుంది; తప్పుకాదే!

కాని ఇది తమ పితృ వర్గోన్మూలకంగా జరుగుతున్న కుట్రపూరితమని, తన తండ్రి అభ్యున్నతికి కొందరు అవరోధం కల్గిస్తున్నారని హరనాథరెడ్డి అంటు న్నారు. అది పొరపాటు; చంద్రశేఖర రెడ్డికి ఒకరు చెరుపుచెయ్యవలసిన అవ సరం లేదు; తనకెత్తిన తానే చెయ్యిపెట్టు కోగల సమర్థుడాయన!

శ్రీ ప్రసన్నకుమారరెడ్డి నుండి ఇటు వంటి అభినందనేమీ రాలేదు. శ్రీనివాసులురెడ్డి బృందంలోని ఎం. పి. శ్రీ పుచ్చలపల్లి పెంచలయ్య జనార్దనరెడ్డిని స్వయంగా కలుసుకొని అభినందించి, అధ్యక్షుడుగా ఆయన నియామకానికి సంతోషం వ్యక్తం చేసినట్లు తెలుస్తున్నది.

ఇక కాంగ్రెస్ మిత్రుని ఆక్షేపణ ఒకటి. గతవారం జనార్దనరెడ్డి తిరుపతి సందర్శనం రిపోర్టులో. "నెల్లూరు ఎమ్మె ల్యేలు కె. వి. సుబ్బారెడ్డి, డాక్టర్ సుందర రామరెడ్డి విమానాశ్రయం గేటుదగ్గరేకాపు కాచి అందరికంటె ముందు తమ మాలలు వేశారు" అన్నమాటలు శ్రీ గూడూరు భాస్కర రామరెడ్డికి అభ్యంతరకరంగా తోచాయి. భాస్కరరామరెడ్డి అభ్యంతర మందే అది సుబ్బారెడ్డిగారి అభ్యంతరం గానే పరిగణించవచ్చు. సుబ్బారెడ్డిగారు అందరికంటే ముందు పూలమాలవేశారని; అదేకాక అందరూ కలిసిపోయిన తరు ణంలో ఒకటవటి వ్యాఖ్యలు సమంజసం కాదని భాస్కరరామరెడ్డి అన్నారు. కోపాలు పెంచేది కొడుకును కంటూవుండే వద్దనే పాపిష్టి అర్థం వుంటుందా? మా అభి మతం మా జిల్లాలో కాంగ్రెస్ వాదులందరూ సమైక్యంగా వుండాలనేదే; మనద్వేష్యం ఏ కోశానాలేదు. వార్తాకథనాలు చూసినప్పుడు విలేఖరులకు కలిగే అనుభూతులమీద ఆధారపడివుంటాయి. మనసులు నిర్మ లంగా వుంటే పత్రికావార్తలు దానికి ఏ విధంగానూ భంగం కల్గించలేవు.

### సేవాదళ్ ఆఫీసరు
జిల్లా కాంగ్రెస్ సేవాదళ్ ఆఫీసరుగా స్వర్గీయ వెంకట్ నాయుడు స్థానంలో ఇంజనీరింగ్ విద్యార్థి శ్రీ టి. భవాని నాగేంద్రప్రసాద్ నియమింపబడినాడట.

విద్యార్థి నియమింపబడడం సంతోషమేగాని, నాగేంద్రప్రసాద్ బెంగు ళూరులో ఇంజనీరింగు చదువుతుంటాడా, నెల్లూరులో సేవాదళ్ కార్యక్రమాల్లో పాల్గొంటాడా చెప్పండి!

### ఫాతిమా కేసులో తీర్పు 29 తేది!
జిల్లాలో సంచలనం సృష్టిస్తున్న ఫాతిమాకేసులో డిఫెన్సు, ప్రాసిక్యూషన వాదనలు 15 తేదితో ముగిశాయి. డిఫెన్సు న్యాయవాదులు ముగ్గురూ-అనంతరామయ్య రంగనాథం, కృష్ణప్రసాద్-చాలా తీవ్ర మైన వాదాలుచేశారు. ఫాతిమా అసలు బషీర్‌హత్య జరిగినరోజు నెల్లూరులోనే లేదని, ఆమెకుమార్తె మలికాబేగం చెప్పిన సాక్ష్యంకూడా కల్పితమేనని వీరు వాదిం చారు. అయితే ఫాతిమా, వెంకటేశ్వర ప్రసాదాది నిందితులు బషీర్ కు వున్న ఆస్తిపాస్తులను చేజిక్కించుకోడానికి ఈ హత్యకు పాల్పడ్డారని పిపి శ్రీ కె. వి. రమణయ్య బల్లగుద్ది వాదించారు.

ఉభయపక్షాల వాదనను విన్న న్యాయ మూర్తి శ్రీ ఎస్. జయరామరెడ్డి తీర్పు కోసం కేసును 29 తేదికి వాయిదావేశారు.

### పేడూరు హత్యకేసు త్రోసివేత
తోటపల్లిగూడూరు మండలం పేడూరు గ్రామంలో జరిగిన హత్యకేసులో, ముద్దా యిలు 14 మంది నిర్దోషులని భావిస్తూ జిల్లాన్యాయమూర్తి శ్రీ ఎస్. జయరామ రెడ్డి తీర్పుచెప్పారు. కేసు త్రోసివేశారు.

1986 సంవత్సరం జనవరి 21 తేది జరిగిందీహత్య. దేవళ్ళ దశరథరామరెడ్డి వర్గానికి చెందిన మద్దినేని వెంకయ్యను, తిక్కవరపు శివకోటారెడ్డి వర్గానికి చెందిన 14 మంది కలిసి చంపారని ప్రాసిక్యూషన నేరారోపణ. అయితే తగిన సాక్ష్యాధారాలు లేవని కేసును న్యాయమూర్తి కొట్టివేశారు. ఈ కేసులో ప్రాసిక్యూషన పక్షంగా పి పి శ్రీ కె. వి. రమణయ్య, ముద్దాయిలపక్షంగా శ్రీ సి. రామకృష్ణ, బి. వి. రమణారెడ్డి, పి. వి. శేషారెడ్డి, ఎ. టి. ఆర్. రత్నా కర్‌లు వాదించారు.

### నెలిట
కలర్ ఫోటోలను డెవలప్‌చేసి, ప్రింట్ చేసేందుకు అత్యాధునిక కంప్యూటర్ పరిక రాలతో నెల్లూరులో పొగతోటలో కలర్ ల్యాబ్ ఒకటి నెలకొల్పారు. పేరు-నెలిట; నెల్లూరు, ఇటలీలలోని తొలి అక్షరాం కలయిక అట ఈ వింత పేరు.

ప్రారంభం డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి; ఆయన హస్తవాసి మహిమతో మంచి వ్యాపారాభివృద్ధి కల్గుతుందని ఆశిస్తాము.

### మరణం
స్వర్గీయ తూకటి కోదండరామరెడ్డి ఏకైక పుత్రుడు, శ్రీ జక్కా వెంకట సుబ్బారెడ్డి అల్లుడు శ్రీ కె. పి. రెడ్డి (44) అస్వస్థులుగావుండి 16 తేది మద్రాసులో [illegible] మరణించారు. ఆయనకు సంతానంలేదు; భార్య, ఐదుమంది అక్క చెల్లెళ్ళు వున్నారు.

సంపద, చదువు, మంచి మనసు కలి గిన కె. పి. రెడ్డి జీవితం మూడుపూలు ఆరుకాయలుగా పుష్కలంగా ప్రకాశింప వలసింది. కాని స్వయంకృతం - నిరర్థ కంగా అర్ధాంతరంగా ఆరిపోవడం విచార కరం.

ఆయన ఆప్తబంధువులకు; ముఖ్యంగా ఆయనకు సన్నిహితంగా వుండిన అక్క బావ శ్రీమతి ఇందిరమ్మ, గోపాలకృష్ణా రెడ్డిగారలకు మా సానుతాపం తెలియ జేస్తున్నాము.

### నీటిమట్టం
సోమశిల (14తేది)

| | |
|---|---|
| 11.32 టి. ఎం. సి. | (273 అ) |
| క్రిందకు విడుదల | 1960 క్యూ. |
| కనిగిరి రిజర్వాయరు | 30.40 అ. |
| సర్వేపల్లి రిజర్వాయరు | 7.75 అ. |
| నెల్లూరు చెరువు | 18.05 అ. |

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకు పుట్టి | 2800.00 |
| ఐ. ఆర్. 20 | 2600.00 |
| సున్నాలు | 2400.00 |
| మొలగొలుకు బియ్యం (70కి) | 880.00 |
| బంగారు సవర (8 గ్రా) | 2880.00 |
| వెండి 10 గ్రా. | 65.00 |

తీసిన సినిమాలు కొనేదిక్కు లేదు; కొన్నా వాటిని ప్రేక్షకులు చూడడంలేదు; నటీనటులు రేట్లుతగ్గించడంలేదు; ఎందరో నిర్మాతలు నెత్తిన కొంగేసుకుని పోతున్నారు; అయినా...

# కొత్తవారు వస్తూనేవున్నారు చేటుకాలం తెస్తున్నారు!

ఈ ఏడు జనవరి నుంచి అక్టోబర్ లోగా దాదాపు 70 స్ట్రెయిట్ చిత్రాలు విడుదలయ్యాయి. వీటిల్లో ఎన్ని విజయవంతమయ్యాయో, ఎన్ని నిర్మాతకు నాలుగు డబ్బులు మిగిల్చాయో ఆలోచిస్తే గుండె తరుక్కుపోతుంది. చిత్రనిర్మాణరంగంలో ఇన్ని చేదు అనుభవాలు ఎదురవుతున్నా ఎవరూ సినిమాలు తీయడం మానలేదు. పైగా ఎప్పటికప్పుడు కొత్త నిర్మాతలు రంగంలోకి ప్రవేశిస్తున్నారు. వ్యవసాయంలోగాని, మరే వ్యాపారంలోనైనాగాని కాస్త లాభాలొస్తే ఓ నలుగురు కలిసి నాలుగు యాభైలు వేసుకుని, రెండు లక్షలతో మద్రాసు చేరుకుంటున్నారు. వీరికి పెద్ద దిక్కు నిర్మాతే. మరొకరో తారసపడతాడు. అతనికి ఏదో వాటా ఇచ్చి ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ అనో, ప్రొడక్షన్ డిజైనర్ అనో పదవి అంటగట్టి, అతనెలా చెప్తే, అలా వింటారు. అతని దృష్టంతా పోయిన తన డబ్బులు ఎలా రాబట్టుకోవాలనే తప్ప- పిక్చర్ సినిమా బాగా రావాలనే ధ్యాస వుండదు. అందుకని తనకిష్టమైన హీరో హీరోయిన్లకు, ఇతర టెక్నీషియన్లకు అడ్వాన్సులు చెల్లించమంటాడు. దాంతో తెచ్చిన డబ్బు అయిపోతే; ఆ నలుగురు నిర్మాతలూ వాళ్ళ ఊళ్ళోని పొలమో, గోడో అమ్మి, ఆ డబ్బుతో చిత్రాన్ని ఎలాగోలాగ పూర్తి చేస్తారు. ఇలా కొత్తనిర్మాతలు రానురాను ఎక్కువవుతున్నారు. అయితే, ఈ దామాషాలో కొనుగోలుదార్ల సంఖ్య పెరగడంలేదు. అందుకే ఎన్నో చిత్రాలు

## మళ్ళీ స్లంప్ వచ్చేస్తూంది!

విడుదలకు నోచుకోకుండా మూలపడి మూలుగుతున్నాయి. కొందరికి ఏదో ఒక రేటుకి సినిమాను అమ్ముకొని బయటపడదాం అనే ఆరాటం మొదలైంది. పెట్టుబడి డబ్బు ఎంతదక్కినా అదే పదివేలు అనుకుంటున్నారు. ఇంత దెబ్బతిన్నా బుద్ధి తెచ్చుకొని ఊరికి తిరిగివెళ్ళకుండా ఈ నలుగురు భాగస్తులూ కొత్తగా నాలుగు కంపెనీలు విడివిడిగా లేవదీస్తున్నారు. ఇలా సినిమాకంపెనీలు ఎన్ని ఎక్కువైతే నటీనటులకు, సాంకేతిక నిపుణులకు అంత మంచిది. ఈ రంగంలో అదృష్టవంతులు వీరే!

చిత్రనిర్మాణ వ్యయాన్ని అరికట్టడం ఎవరితరమూ కాదు. అమధ్య కొందరు నిర్మాతలు సమావేశమై, ఏవేవో నిబంధనలను ప్రవేశపెట్టారు. వాటిని అమలు చేయగలిగారా? పేపర్ పబ్లిసిటీ విషయం తీసుకుందాం. పూర్తిపేజీ ప్రకటనలను నిషేధించి, పావుపేజీ మాత్రమే ఇవ్వాలని నిర్ణయించుకున్నారు. దీనిని ఎంతవరకు పాటించారు? కొద్దికాలానికే మళ్ళీ పూర్తిపేజీ ప్రకటనలు-అందునా మల్టీకలర్‌తో వెలువడుతున్నాయికదా? నిర్మాతలలో ఐక్యత లేకపోవడంవల్లేకదా ఇతరుల డామినేషన్ ఎక్కువైంది!

ఇక కొనుగోలుదారుల విషయం తీసుకుందాం. హీరోల ఇమేజ్‌లను దృష్టిలో వుంచుకొని గుడ్డిగాసినిమాలనుకొన్న బయ్యర్లకు ఆయాసినిమాలుబాక్సాఫీస్‌దగ్గరపల్టీలు కొట్టడంతో వాళ్ళ అంచనాలు తల్లక్రిందులైనందుకు దిక్కుతోచని పరిస్థితి ఏర్పడింది. వారానికి నాలుగు సినిమాలు విడుదలవుతున్నప్పుడు అన్ని సినిమాలుచూసే స్తోమత ఎంతమందికివుంటుందని కొనుగోలుదార్లు ఆలస్యంగా గుర్తించారు. అందుకే మళ్ళీ స్లంప్ రాబోతుంది!

### "దీపావళి" కి చిత్రాల హడావిడి తగ్గింది

సాధారణంగా దీపావళి పండుగ సందర్భంలో మూడు నాలుగు చిత్రాలు విడుదలయ్యేవి. ఈ మారు ఆ హడావిడి లేదు. చాలామంది తొందరపడి రీళ్ళుచుట్టేసి సినిమాలను పూర్తి చేశారేగాని, కొనుగోలుదారులు రాకపోవడంతో నిరాశ చెందారు. కొనుగోలుదారులువచ్చినా నిర్మాతలుచెప్పే రేటుకి ఒప్పుకునేలాలేరు. ఎంత కొమ్ములు తిరిగిన హీరో నటించిన చిత్రమైనా రెండో వారానికే కలెక్షన్లు తగ్గుతున్నాయని కొనుగోలుదారుల గోడు. మేమేం చేస్తాం, మేం భారీగాతీశాం. అంచేత వ్యయం ఎక్కువైందని నిర్మాతల మొర! ఇదీ పరిస్థితి. ఈ అదనుచూసి కొందరు డబ్బింగ్ చిత్రాలను విడుదలచేశారు. వాటిల్లో కాస్తోకూస్తో వినూత్నత్వం ఉన్నందున అంతో ఇంతో డబ్బు చేసుకుంటున్నాయి. ★



'అజాతశత్రువు' కృష్ణ.

# విశ్వామిత్ర ఎవరుతీస్తారు- ఎన్టీఆరా? కృష్ణంరాజా?

"అల్లూరి సీతారామరాజు కథ" ను ఎన్. టి. ఆర్. తీస్తాతీస్తానంటూ కాలయాపన చేస్తూండేసరికి పట్టుకున్న హీరో కృష్ణ ఆ అమరవీరుని కథను అద్భుతంగా తెరకెక్కించి, సంచలనం సృష్టించారు. "బ్రహ్మర్షి విశ్వామిత్ర" చిత్రం విషయంలో కూడా అదే జరుగుతుందేమో! కృష్ణంరాజువద్ద ఆ స్క్రిప్టు సిద్ధంగావుంది. ఎంతో పకడ్బందీగా తయారైన స్క్రిప్టు కృష్ణంరాజు తీయాలేగాని, తీస్తే సూపర్ హిట్ అయితీరుతుందని పరిశ్రమలోని చాలామంది అభిప్రాయం. ఎన్. టి. ఆర్. తానూతీయక, ఇతరులనూ తీయనీయక పోతే ఎంతకాలమని ఎవరైనా ఓపిక పడతారు?

వీళ్ళిద్దరూ తీయకపోతే గప్‌చుప్‌గా స్క్రిప్టు సిద్ధంచేసుకొనివున్న మరోనిర్మాత మాత్రం రంగంలోకి దూకడం ఖాయం.



## ఇది తారల పురుళ్ల సీజన్

ఆ మధ్య పెళ్ళిళ్ళ వార్తలు. ఇప్పుడు పురుళ్ళ వార్తలు. జయచిత్ర ఒక మగ శిశువును ప్రసవించింది. నెల్లూరీయుడు ఎం.ఎస్. గోపీనాథ్ పుత్రుడు హీరో సురేష్ ఒక అబ్బాయికి తండ్రి అయ్యాడు. వై. విజయ గర్భవతి. ఆమె విశ్రాంతి తీసుకునే సమయంలో ఆమె ఛాన్సులు కొట్టెయ్యాలని మరికొందరు తారల తాపత్రయం.

